Regd. No.
H. NL. 88
సంపుటి: 56
సంచిక: 19

# జమీన్‌రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

10-5-85
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

# రాజీవ్‌తో రామారావు రాజీ?

కేంద్రంతో నిరంతరం ఘర్షణపడే తన అలవాటును మానుకొని ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీకి చేరువతుగా లొంగిపోయారని రాష్ట్ర రాజకీయ వర్గాలలో బాహాటమైన వదంతులు వినిపిస్తున్నాయి. ప్రధానితో కుదుర్చుకున్న అవగాహన ప్రకారం భారతదేశం పార్టీ స్థాపనకు

మా హైదరాబాదు విలేఖరి

శ్రీ రామారావు వ్యస్తిచెప్పినట్లేనని రాజకీయ వర్గాలవారు అంటున్నారు. భారతదేశం పార్టీకి జాతీయ ప్రతిపక్ష నాయకులనుంచి మద్దతు లభించకపోవడం, ఎన్నికలైపోయినతర్వాత కేంద్రాన్ని అదేపనిగా విమర్శించడంవల్ల వావుకునేదేమీ వుండదని భావించడంవంటికారణాల మూలంగా ముఖ్యమంత్రి ప్రధానితో రాజీపడ్డారని అంటున్నారు. పంజాబ్ వ సమస్య పరిష్కారానికి ధైర్యంతోకూడుకున్న నిర్ణయాలను తీసుకుంటూ దేశ ప్రజల దృష్టిని ఆకర్షిస్తున్న శ్రీ రాజీవ్

చిక్కునసమస్యలను పరిష్కరించటంలో కేంద్రం తలమునకలుగావున్న ప్రస్తుత తరుణంలో రామారావు 'భారతదేశం' పార్టీని ఏర్పాటుచేస్తే అది పార్టీకి ఇబ్బందికరంగా వుంటుందేమోనని భయపడుతున్నారని తెలుస్తున్నది.

కాంగ్రెస్ నాయకుల ఈ బలహీనతను పసికట్టిన ముఖ్యమంత్రి తెలివిగా ప్రవర్తించి తాను భారతదేశం పార్టీని ఏర్పాటు చేయనని కేంద్రంతో ఇకముందు సహకరిస్తానని ప్రధానికి చెప్పారని తెలిసింది. ఇందుకు బదులుగా కేంద్రం తనకు సహకరించి ప్రజలకు తానుచేసిన వాగ్దానాలను అమలుకు ఉదారంగా తోడ్పడాలని, కౌన్సిల్‌ను రద్దుచేయాలని ఆయన కోరినట్లు తెలుస్తున్నది. ఢిల్లీలో ప్రధానితో అవగాహన కుదిరినందువల్లనే ముఖ్యమంత్రి హైదరాబాద్‌కు వచ్చి భారతదేశంపార్టీ ఏర్పాటు వాయిదాపడిందని ప్రకటించారని భావించబడుతున్నారు. అయితే కాంగ్రెస్ (ఐ) నాయకులుమాత్రం కావలసినంతబలంలేక రాష్ట్రంలో కాంగ్రెస్ (ఐ) ప్రతిష్ఠ మరింత దెబ్బతింటుందని వాదిస్తున్నారు. అసెంబ్లీలో తెలుగుదేశానికి మెజారిటీ వుండటం, అక్కడి ప్రతిపక్షాలన్నీ ఆ పార్టీ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి వుండడంతో కాంగ్రెస్ (ఐ) ఏకాకిగా మారి ప్రధాన ప్రతిపక్షంగా బాధ్యతను నిర్వహించలేకపోతున్నదని, ఆ కారణంగా కౌన్సిల్ అవసరమని వారు అభిప్రాయపడుతున్నారు.

ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ కాంగ్రెస్ (ఐ) నాయకుల వాదనలసారాన్ని గుర్తించినప్పటికి, కౌన్సిల్ రద్దును తిరస్కరిస్తే, శ్రీరామారావుదానిని ఒకసమస్యగా చేసి ప్రయోజనం పొందుతారని, అందువల్ల రద్దుకేని తీరాలని అనుకుంటున్నట్లు తెలిసింది. అయితే బయటికి ఈ కారణం చెబుతున్నప్పటికి శ్రీ రామారావు తనతో చెప్పిన మాటలకు ఎంతవరకు కట్టుబడివుంటారో తేల్చుకోడానికి పరీక్షగా కౌన్సిల్‌ను రద్దు చేయాలనికూడా ప్రధాని అనుకుంటున్నట్లు తెలుస్తున్నది.



రాజీయా? రాజకీయమా?

కౌన్సిల్ రద్దుకు కేంద్రం నిర్ణయం

పోతుంది? ఈ ప్రశ్నలనుగూర్చికూడా రాజకీయవర్గాలలో తీవ్రమైన చర్చ జరుగుతున్నది.

మీద తిరుగుబాటే అవుతుంది. కాని కౌన్సిల్ కాంగ్రెస్‌పార్టీ నాయకుడు శ్రీ రోశయ్యకాని, రాష్ట్ర కాంగ్రెస్ నాయ

—కొరవ 6వ పేజీలో

# 'భారతదేశం' విరమణకు కౌన్సిల్ రద్దు పణం?

గాంధీని వ్యతిరేకిస్తే ప్రజల్లో తనపైవున్న సానుభూతిపోయి అప్రతిష్ఠ వస్తుందేమోనని శ్రీ రామారావు భయపడడం ఇందుకు మరొక ముఖ్యకారణంగా చెబుతున్నారు.

భారతదేశంపార్టీ స్వరూప స్వభావాలు ఎలావుండాలో తికమకపడుతున్న ముఖ్యమంత్రికి పార్టీ ఏర్పాటుపట్ల పెద్దగా ఆసక్తిలేదని, కేంద్రాన్ని బ్లాక్‌మెయిల్ చేయడానికి పార్టీ ఏర్పాటుగురించి పదే పదే ప్రకటనలు గుప్పిస్తున్నారని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. అయితే ఈసంగతి గుర్తించని కాంగ్రెస్ (ఐ) అధిష్ఠానవర్గం నాయకులు పంజాబ్‌వంటి

వచ్చు. ఆతర్వాత కౌన్సిల్ రద్దుగురించి కూడా పరిశీలిస్తామని ప్రధాని తనకు హామీయిచ్చారని ప్రకటించి రద్దుతీర్మానాన్ని తిరిగి ఆమోదించేందుకు గతనెల 30 తేదిన అసెంబ్లీ సమావేశాన్ని ముఖ్యమంత్రి హడావుడిగా ఏర్పాటుచేయడం గమనించవలసిన అంశం.

కౌన్సిల్ ముఖ్యమంత్రి పక్కలో బల్లెంగా మారిందని ప్రతిపక్షాలన్నింటిని తెలివిగా కలుపుకుని కౌన్సిల్‌లో కాంగ్రెస్(ఐ) ప్రభుత్వంపై చేసేదాడులవల్ల తన గ్లామర్ దెబ్బతింటున్నదని భావిస్తున్నందువల్లనే దానిని ఏదోరకంగా వదిలించుకోవాలని ముఖ్యమంత్రి [illegible]

శ్రీ రామారావు ప్రధానితో రాజీపడిన వైనం గురించి ఇటు ప్రధాని కార్యాలయంలోను, అటు ప్రతిపక్షనాయకుల శిబిరాల్లోనూ చెప్పుకుంటున్నారని: ఎట్టి పరిస్థితులలోకూడా శ్రీ రామారావు విశ్వసించడానికి వీలులేని వ్యక్తి అని ప్రధాని వ్యాఖ్యానించారని ఒక ప్రముఖ ఎం. పి అన్నారు.

○ ○ ○

కౌన్సిల్ రద్దు చేయడానికే ప్రధాని నిర్ణయానికివస్తే దానికి ఆయన అంతరి కాంగ్రెస్ నాయకులను ఒప్పించగలడా? రద్దు ప్రభావం రాష్ట్రంలో కాంగ్రెస్ మీద, కాంగ్రెస్‌వాదులమీద ఎట్లా వుండ

తీసుకోవడమంటూ జరిగితే కౌన్సిల్‌లోని కాంగ్రెస్ సభ్యులందరూ మూకుమ్మడిగా ముందుగానే తమ రాజీనామా పత్రాలను కాంగ్రెస్ అధ్యక్షునికి సమర్పించవచ్చునని వచ్చినవార్త కొంత కలవరాన్నే రేపింది. ఈసమస్యపై కాంగ్రెస్ వాదులలోని అసంతృప్తి ఆగ్రహం, కౌన్సిల్ సభ్యులు తమరాజీనామా పత్రాలను బెదరింపుగా కాంగ్రెస్ అధ్యక్షునికి కాకుండా, నిరసనగా నేరుగా ఛైర్మన్‌కే పంపవచ్చునని చెలరేగిన పుకార్లు మరింత ఆందోళన కల్గించాయి. ఇదనే జరిగితే అది ప్రత్యక్షంగా ప్రధానిమీద, కాంగ్రెస్ అధిష్ఠానవర్గం

## కార్యదర్శులు

ప్రదేశ్ కాంగ్రెస్ కార్యదర్శులుగా కృష్ణ జిల్లాపరిషత్తు మాజీ అధ్యక్షుడు శ్రీ చిన్నమనేని కోటేశ్వరరావును: మాజీ మంత్రి శ్రీ ఎన్. అమరనాథరెడ్డిని అధ్యక్షుడు శ్రీ వెంగళరావు తీసుకున్నారని తెలుస్తున్నది.

దీన్నిబట్టి వెంగళరావు వైఖరి అన్నివర్గాలను, అందరు నాయకులను అనుకూలంగా వుంటుందా అనిపిస్తుంది.

# జనార్ధనరెడ్డి అధ్యక్షుడైతే జి.కాం.స్థాయి పెరుగుతుంది

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు, కార్యవర్గం మారిందికాబట్టి, జిల్లా కాంగ్రెస్ కమిటీలుకూడా కొత్తవి ఏర్పడాలి. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ వెంగళరావు ఈ విషయంలో అప్పుడే తన అభిప్రాయాన్ని ప్రకటించారుకూడా. పదవి చిన్నదనుకోకుండా మాజీమంత్రులు సైతం ఈ పదవిని చేపట్టుటకు సిద్ధపడాలని ఆయన కోరారు

నెంరోజుల క్రితం మన జిల్లా కాంగ్రెస్‌కు సంబంధించి ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూ- ఈవిషయంలో పదవిచిన్నదనుకోకుండా జి. కాం. అధ్యక్షతను శ్రీ జనార్ధనరెడ్డి చేపడితే బాగుంటుందని, జిల్లాలో కాంగ్రెసువాదులంతా సమీకరించి సంఘటితపరచగలిగినసైతె కవ్యక్తి ఆయనొక్కడేనని శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డి వెలిబుచ్చారు. అయితే తన ఈ అభిప్రాయాన్ని జనార్ధనరెడ్డికో ప్రస్తావించగా దానికి ఆయన సందేహించారు; చిన్నపదవిని స్వీకరించమనికోరి తనను చిన్నబుచ్చుతున్నారని జనార్ధనరెడ్డి ఏమైనా అనుకుంటాడేమోనని గునుపాటి జంకారు.

**మా రాజకీయ పరిశీలకుడు**

గునుపాటి ఒక్కడేకాదు; జిల్లాలో అందరూ కాంగ్రెస్ అధ్యక్షతను జనార్ధనరెడ్డి చేపట్టాలని గట్టిగా కోరుకుంటున్నారు; కాని పిల్లిమెడకు గంటకట్టేదెవరన్నట్లు, తమ అభిప్రాయాన్ని జనార్ధనరెడ్డి ముందు వెలిబుచ్చడానికి అందరూ వెనుకాడారు. ఎవరి సంగతో ఎందుకు; జనార్ధనరెడ్డికి జిల్లాకాంగ్రెస్ అధ్యక్షపదవి అంటే అయన్ని న్యూనత పరచినట్లుగా వుంటుందేమోనని మొదట్లో ఈ పరిశీలకుడుకూడా భావించాడు. కాని పునరాలోచనలో అటువంటి అభిప్రాయం పొరపాటనే నిశ్చితాభిప్రాయం దృఢంగా కలిగింది. ఎవరు ఎంత పెద్ద పదవికి

—కొనసాగింపు 10 వ పేజీలో

## పినాకిని తీరం

### సర్వప్రియుడు

**జి. వి. రమణయ్య**

'ఆంధ్రజ్యోతి' జిల్లావిలేఖరి శ్రీ జి. వి. రమణయ్యకు 7 తేది షష్టిపూర్తి జరిగింది. షష్టిపూర్తి జరగటం విశేషం కాదు, ఆ ఉత్సవాన్ని జర్నలిస్టులే జరపడం విశేషం. ఏమిటి అందులో విశేషమంటారా? ఈర్ష్యాసూయలు, ద్వేషానలాలు, సంకుచితతత్వాలు మూర్తీభవించిన మహానీయులము జర్నలిస్టులమైన మేము. అసూయకు, ద్వేషానికి ఇతరులకైతే ఏదైనా కారణంకావాలి, నిష్కారణంగా, నిర్హేతుకంగా అసూయను వెళ్ళగక్కగలిగిన, ద్వేషాన్ని ప్రదర్శించగలిగిన వరాన్ని దైవం జర్నలిస్టులమైనమాకే ప్రసాదించినట్లున్నాడు అటువంటి జర్నలిస్టులు ఒకపాటి జర్నలిస్టు షష్టిపూర్తిమహోత్సవాన్ని జరిపారంటే వృత్తవిశేషంకాదు; మహాగొప్ప విశేషమని నా అభిప్రాయం. నెల్లూరు జర్నలిస్టు మిత్రుల విశాలదృక్పథానికి, ఔదార్యగుణానికి హృదయపూర్వకంగా జేజేలు చెప్తున్నాను.

ఈ గొప్పతనం జర్నలిస్టులకంటే, శ్రీ జి. వి. రమణయ్యదనే చెప్పాలి. అతను వివాదరహితుడు, సర్వప్రియుడు స్నేహపాత్రుడు, వినయశీలుడు; అభిమానించడం, ఆప్యాయతను ప్రదర్శించడం, గౌరవమర్యాదలతో వ్యవహరించడం తప్ప మరొకవిధంగా ప్రవర్తించడం అతనికి తెలియదు. అతన్ని ద్వేషించాలన్నా మీరు ద్వేషించలేరు; అతన్ని దూషించాలన్నా దూషించలేరు; అతనితో స్నేహం సౌహార్దంగా తప్ప మరొకవిధంగా వుండలేరు. రమణయ్యలోని అనితరసాధ్యమైన ఆ సర్వామోదం స్వభావమే నెల్లూరు జర్నలిస్టుల చేత షష్టిపూర్తి జరిపించింది అనడం సరిగా వుంటుందేమో;

రమణయ్య నాకు మూడున్నర దశాబ్దాల మంచి మిత్రుడు; అయన జనతా పత్రికా జాతాముఖ ప్రాతినిధ్యం; నాది ఒక చిన్నపత్రిక అనుబంధం, అయినా ఆ స్నేహానుబంధం ఈనాటివరకు అట్లనే కొనసాగుతున్నది. గూడూరులో అహా రమణయ్య అంటే, వారెవరైనాకాని, ఏరంగానికైనా చెందనీ, పత్రికావిలేఖరి రమణయ్యగానే పసిపిల్లలకు కూడా ఎరుక. గూడూరు జనజీవితంతో రమణయ్య జీవితం అంతగాఢంగా పెనవేసుకొనిపోయింది. ఇటీవల సంవత్సరాల్లో గూడూరును తన తనయులకప్పగించి, తన కార్యరంగాన్ని నెల్లూరుకు మార్చుకొని పట్టణ స్థాయినుండి జిల్లా స్థాయికి ఎదిగాడు.

రమణయ్యకు చిన్న పెద్ద తేడాలేదు; పోలీస్ కానిస్టేబిల్ దగ్గరకు ఎంతచొరవగా పోగలడో, ఇండియా ప్రెసిడెంటువద్దకూ అంతచొరవగానే పోగలడు. 1951-52 నాటి సంగతి, నీలం సంజీవరెడ్డిగారు కోటకువచ్చారు; పెళ్లేటి గోపాలకృష్ణారెడ్డిగారికి గూడూరు కాంగ్రెస్ అభ్యర్థిత్వం ఇప్పించడానికి ఏర్పాటైన కార్యక్రమం అది. రమణయ్య, నేను విలేఖరులుగానే పోయాము; నా సంతకం నేనేమో కాస్తదూరంగానే కూర్చున్నాను; రమణయ్యమాత్రం ఒక నమస్కారబాణంవేసి చిరపరిచితుడులాగాపోయి ప్రక్కనే ఆసీనుడై సంజీవరెడ్డిగారిని మాటలలోకి దించాడు. పెళ్లేటి రెడ్డిగారింట్లో జరిగిన ఈసన్నివేశం ఈనాటికి నాకు బాగా గుర్తు. రమణయ్య చొరవనుగూర్చి చెప్పడానికి ఈ సంఘటన ప్రస్తావించవలసివచ్చింది. సవ్యత, క్రమత, నమస్కారం రమణయ్య విజయాయుధాలు.

రమణయ్య విలేఖరి; జర్నలిస్టుకాడు. విలేఖరికూడా జర్నలిస్టు అంటే నాకుఅభ్యంతరం లేదు. నిజమే, రమణయ్య పత్రికారంగానికివచ్చినపుడు విలేఖరి నిర్వర్తించవలసిన ధర్మాలు వేరు; ఇప్పటికార్యక్రమం వేరు. తల్లక్రిందులుగా మారిపోయింది, అనాడు విలేఖరి వార్తను వార్తగానే ప్రసారం చేసేవాడు; ఈనాటి విలేఖరి వార్త వెనుకనున్న కథను కూడా కలిపి వ్రాయాలి; అంతే అనాటి విలేఖరి వివాదరహితుడుగా వుండడానికి వీలుం

—కొనసాగింపు 10వ పేజీలో

# అధికారుల అవినీతితో అధోగతి పాలైన బకింగ్‌హాం కాల్వ!

విజయవాడ, మద్రాసుల మధ్య అత్యంత చౌక జలరవాణామార్గంగా పేరు పొందిన బకింగ్‌హాం కాలువ, అధికారుల అవినీతి అలక్ష్యంవల్ల నిరుపయోగమైపోయింది.

ఇదివరకు తీరగ్రామాల ప్రజలు, ముఖ్యంగా నెల్లూరు జిల్లాకు చెందిన వేలాదిమంది బెస్తలకు బకింగ్‌హాం కాలువ జీవనోపాధి కల్పించేదిగా వుండేదన్నా ఆశ్చర్యం లేదు, ఇటు మద్రాసు, అటు విజయవాడలకు ఉప్పు, కట్టెలు, వంటచెరకు, బొగ్గు, బియ్యం ఇతర సామగ్రి రవాణా చేయడానికి పూర్వం బకింగ్‌హాం కాల్వే ప్రధానమార్గం. కాల్వ బాగా ఉన్న స్థితిలో వున్నప్పుడు 32 టన్నుల సామర్థ్యం కలిగిన పడవలు కూడా ప్రయాణిస్తుండేవి. ఏ సమయంలో నూ ఎక్కడకూడా కాలువలో నిలువలేకుండా నీళ్లు తగ్గకుండా వుండేవి. పూడిక లేకుండా అదుపు చేయడానికి లాకులు వుండేవి. ప్రతి లాకుకూ కొంత మంది సిబ్బంది వుండేవారు. తైవెన్ను జలమ్ము పీల్చి పెద్దఎత్తున లభ్యమౌతుండేవి. పైగా తీరగ్రామాల ప్రజల ప్రయాణం ఎక్కువగా పడవలపైనే జరిగేది.

అది చౌకే కాక, సులభం కూడా. కృష్ణపట్నం జెట్టీనుంచి వతగలి గ్రామం వెళ్లాలంటే జలమార్గంలో మూడుమైళ్లు; రోడ్డుపైన అయితే 50 మైళ్ళవుతుంది. సిద్దవరంగ్రామానికి కాలువలోవెళితే 18 కిలోమీటర్లు; రోడ్డుపైన అయితే కృష్ణపట్నం నుంచి ముత్తుకూరుకు, అక్కడి నుంచి గూడూరు, చివర్న సిద్దవరం చేరాలి.

బకింగ్‌హాం కాలువవల్ల ఇన్ని సౌకర్యాలున్నప్పటికీ ప్రభుత్వం దానిని పాడు పెడుతున్నది. కాల్వ పూడికతీసే పనిలో అధికారులు కాంట్రాక్టర్లతో లాలూచి పడి పూడిక తీయకుండానే బిల్లులు మంజూరు చేస్తున్నారు. గండ్లు సరిగా పూడ్చటంలేదు. దీని ఫలితంగా కాలువ క్రమక్రమంగా పూడిపోయి, చిన్న పడవలు పోవడానికికూడా వీలులేని పరిస్థితి ఏర్పడింది.

ప్రభుత్వం ఈ కాల్వ అభివృద్ధికి ఎక్కువనిధులు మంజూరుచేసి; అధికారులు తమ స్వల్ప స్వార్థంకోసం, కాలువను బలిపెట్టడం మాని, సక్రమంగా అభివృద్ధిచేస్తే మద్రాసు నెల్లూరుల మధ్య రవాణా చౌక సులువు అవుతుంది.

ముత్తుకూరు —రంగాచార్యులు

### ఎడగారుగా వరిని వదలివేయడం మేలు!

రామరాము నెల్లూరు జిల్లాలో ఎడగారుగా వరిసాగు చేయడం పెద్దపొరపాటుగా పరిగణిస్తాం. ఫిబ్రవరి నెలనుంచి వేసవి కాలం అంతా మనకు కరెంటువరఫరా సక్రమంగా వుండదు. లేదు దీన్నినమ్ముకొని వరిపైరు పెడితే నీరు సరఫరా చేయడం సాధ్యంకాక దెబ్బతిని పోవలసివస్తున్నది. పైగా ధాన్యానికి ధర లేదు.

ఈ యాతనలులేకుండా ఎడగారుకు వరిని వదలి పేసి మెట్టపైర్లు సాగు చేసినా గిట్టుబాటు చేసుకోవచ్చు.

డిసెంబరు నెలాఖరులో ఉలవ, పెసర వంటి తృణధాన్యాలు చల్లుకుంటే ఉగాది నాటికి పంట చేతికివస్తుంది. మే నెల ప్రారంభంలో నువ్వులు, వేరుసెనగ, మొక్కజొన్న కదిరిత అరకళ్ళనంటలు సాగుచేయవచ్చు. వరికి ప్రత్యామ్నాయంగా ప్రత్తి సాగుచేయవచ్చు కాని. వేసవికంది పుల్ల, ఉత్తర కార్తెల్లో సాగు చేస్తే మహసూలుకు ఇబ్బంది ఎదురవుతుంది.

వరిపైరును రెండు, మూడవకారులలో

—కొనసా 12 వ పేజీలో




# జమీన్‌రైతు

## ఢిల్లీ కాంగ్రెస్

ఈవారమంతా ఢిల్లీ నగరం కాంగ్రెస్ వర్షంతో మార్మోగిపోయింది. ఒకవైపు పంజాబులో హత్యాకాండ; మరోవైపు గుజరాత్‌లో అగ్నిజ్వాలలు.. ఈ విధమైన సంక్షుభిత వాతావరణంలో గంభీరంగా, ప్రశాంతంగా, ఉత్సాహభరితంగా జరిగాయి ఏ. ఐ. సి. సి., కాంగ్రెస్ శతవార్షిక జయంతి ప్రారంభోత్సవ సభలు.

ఇందిరాగాంధీ లేని మొదటి అఖిలభారత కాంగ్రెస్ సమావేశం ఇది; రాజీవ్‌గాంధీ కాంగ్రెస్ అధ్యక్షుడు, ప్రధాని అయిన తర్వాత జరిగిన తొలి సమావేశం. కాంగ్రెస్ అధ్యక్షుడుగా కార్యవర్గం చేసిన రాజీవ్‌గాంధీ నియామకాన్ని ఏ. ఐ. సి. సి. ధృవపరచింది. రాజీవ్ అన్నివిధాల అదృష్టవంతుడు. ముత్తాత, తాత, తల్లి అధిష్ఠించిన కాంగ్రెస్ అధ్యక్షస్థానాన్ని అలంకరించగలిగిన మహద్భాగ్యాన్ని దక్కించుకోగలిగిన యువకుడాయన. తాత, తల్లుల ప్రధానిత్వానికికూడా వారసుడైనవ్యక్తి. పదవుల నలంకరించడం కాదు; ఆ పదవులకు తగినవాడని ప్రజలచేత అనిపించుకోవడం రాజీవ్‌గాంధీ నిజమైన అదృష్టం.

ఇటీవలి సంవత్సరాలలో ఏ. ఐ. సి. సి. సమావేశమనేది నామమాత్రమైనదైపోయింది; ఏకపాత్రాభినయంవంటి అప్రధానమైపోయింది. కాంగ్రెస్ వాదులలోనైనా ఉత్సాహం కల్గించలేనిదై పోయింది. అటువంటి ఏ.ఐ.సి.సి. మొన్న కళకళలాడుతూ విందుగా జరగడం చెప్పుకోదగిన విషయం. బహుశా కాంగ్రెస్ అధ్యక్షుడు-ప్రధాని కొత్తవాడుకావడం ఈ నూతనోత్తేజానికి కారణంకావచ్చు;

సాధారణంగా ఏ. ఐ. సి. సి. సమావేశాల్లో పార్టీ, ప్రభుత్వవిధాన నిర్ణయాల పునరుద్ఘాటన, ధృవీకరణతప్ప. ఉపన్యాసాల్లో; తీర్మానాల్లో అద్భుతాలు, ఆశ్చర్యాలు ఏమీ వుండవు. అయితే రాజీవ్‌గాంధీ విధానాల వల్ల దేశంలో ఒక అపోహ ఏర్పడుతుంటింది. ఆయన ఇందిరాగాంధీ విధానాలన్నిటిని తల్లక్రిందులు చేస్తున్నాడని, ముఖ్యంగా ఆర్థికవిధాల విషయంలో సోషలిజానికి తిలోదకాలిచ్చి, క్రమంగా తద్విరుద్ధమైన విధానాలను అనుసరించే పోకడలకు పోతున్నడనే విమర్శలు చెలరేగాయి. అందువల్లనే కాంగ్రెస్ తన సోషలిజం మార్గాన్నుంచి ప్రక్కకు పెడదోవ పట్టలేదని ఢిల్లీ ఏ. ఐ. సి. సి. నిర్ద్వంద్వంగా పునరుద్ఘాటించింది; దీనితో రాజీవ్‌పట్ల వున్న అపోహలు, అనుమానాలు సహజంగా పటాపంచలైపోతాయి; పంజాబు, గుజరాత్, పెరుగుతున్న ధరలువంటి అనేకసమస్యలమీద తీర్మానాలు జరిగినా, ముఖ్యమైంది సోషలిజం తీర్మానమే.

కాంగ్రెస్ శతవార్షిక జయంతికి రోజే ప్రారంభోత్సవం జరిగింది. ఈ సందర్భంలో ఏదో ఒక కారణంతో కాంగ్రెస్‌ను వదలిన కాంగ్రెస్ నాయకులను తిరుగా మాతృ సంస్థలోకి రావలసిందిగా రాజీవ్‌గాంధీ ఆహ్వానించడం ప్రశంసనీయమైన విషయం. రాజీవ్ ఆహ్వానాన్ని శ్రీమతి అజిత్ అనపాలి, అజయ్‌ఘోష్, సి. సి. దేశాయ్‌వంటి పెద్దలు కొందరు గౌరవించారు! ఉత్సవంలో పాల్గొన్నారు. నిజలింగప్ప, నీలం సంజీవరెడ్డివంటి నాయకులు నిరాకరించారు. యువకుడైనా రాజీవ్ ప్రదర్శించిన ఔదార్యాన్ని, ఉదాత్తతను వయోవృద్ధులైన ఈ పెద్దలు వినియోగించుకోలేకపోయారు.

ఎన్నోపార్టీలు పుడుతున్నాయి, పోతున్నాయి, ఎన్నోపార్టీలు ఏకమవుతున్నాయి, చీలిపోతున్నాయి; ఎన్నోపార్టీలు. ఎందరో నాయకులు కలసి కాంగ్రెస్‌ను తల్లక్రిందులు చేయాలనుకొని తామే తల్లక్రిందులైపోయారు. నాటికి నేటికి నూరేళ్ళు నిండినా కాంగ్రెస్ ప్రజల సంస్థ. అది రాజకీయగంగే దాని ప్రాధాన్యతను, పవిత్రతను కాపాడుకోవాలి, వృద్ధతరం నిష్క్రమిస్తున్నది; దాని స్థానాన్ని యువతరం ఆక్రమిస్తున్నది. కాంగ్రెస్ సంస్థను చైతన్యవంతమైన సంస్థగా చిరకాలం యువతరంకూడా వర్ధిల్ల చేయగలదనే విశ్వాసం ప్రజల్లోవుంది; రాజీవ్‌గాంధీకి మొన్న పార్లమెంటులో అఖండమైన బలాన్నివ్వడమే అందుకు నిదర్శనం.

## మేము-మీరు

### ఆ మాటలు ఆక్టన్‌వి

కావలిలో కాంగ్రెసు గెలుపుపై మీ అనుబంధంలో (ఏప్రెల్ 26) 'Power corrupts; obsolute power corrupts obsolutely' అన్న కొటేషన్ ఉదహరిస్తూ, ఇవి పూజ్య రాజాజీ పలికినపలుకులుగా అభివర్ణించారు. కానీ ఆ మాటలు అన్నది లార్డ్ ఆక్టన్ (Lord Acton).

ఆయన ఈ క్రిందివిధంగా అన్నారు. "all power Corrupts, and absolute power Corrupts absolutely". మంచి కొటేషన్ వ్రాసినందుకు చాలా సంతోషం.

కావలి —ఎ. రాఘవులు ఎం. ఎ.



అంధ్రప్రదేశ్ ప్రభుత్వము

## ఉద్యోగ ప్రకటన

ఈ క్రింద కనబరచిన ఉద్యోగముకొరకు దరఖాస్తులు 15-5-85 తేదిన సా. 5 గం. లోపల పర్యవేక్షకులు, దొడ్ల సుబ్బారెడ్డి ప్రభుత్వ వైద్యశాల, నెల్లూరు వారికి అందవలయును. ఆలస్యముగా చేరిన దరఖాస్తులు తిరస్కరించబడును.

| | | |
|---|---|---|
| 1, | ఉద్యోగముపేరు | : మేల్ కోటి |
| 2, | ఖాళీల సంఖ్య | : ఒకటి (సెలవు) |
| 3. | విద్య మరియు ఇతరఅర్హతలు; | చదువుట, వ్రాయుట తెలిసివుండవలెను |
| 4. | వయోపరిమితి | : 18 సం.ల పైబడి 34 సం.ల లోపల వుండవలెను |
| 5. | జీతము | : రు. 290-5-345-10-425 |
| 6. | నిబంధన | : పురుషులు మాత్రమే (షెడ్యూలు కులములవారికి మాత్రమే) |

దరఖాస్తు నమూనా

1.. అభ్యర్థి పేరు 2. తండ్రి పేరు 3. చిరునామా 4. పుట్టిన తేది
5. విద్య మరియు ఇతర అర్హతలు 6 ఎంప్లాయిమెంట్ నెంబరు, తేది
అభ్యర్థి సంతకము,

వరుస నెంబర్లు 4, 5, 6 నాటి నకలు జతపరచి పంపవలెను.

డా. యం. వి. రమణరావు ఎం. డి.
పర్యవేక్షకులు
దొడ్ల సుబ్బారెడ్డి ప్రభుత్వ వైద్యశాల, నెల్లూరు.

# ఎరువులఅమ్మకానికి ఎం.ఎస్‌సి. డిగ్రీకావాలా?

## మంచి విత్తనాలు కావాలి!

కంచే చేనుమేస్తే కంచె దిక్కు అని సామెత. ప్రభుత్వ సంస్థ అయిన విత్తనాభివృద్ధి సంస్థ (ఎ. పి. సీడ్స్ కార్పొరేషన్) విత్తనాలలోనే కేడి (సరైన పద మేమిటో?) వుంటే, ఇక మంచి విత్తనాలను ఎక్కడ ఆశించగలం?

నిరాధారంగా వేస్తున్న ప్రశ్నకాదిది. స్వానుభవంతో తెలుసుకొన్న విషయమే. మొన్న 189-68 వరివిత్తనం తీసుకొని నారుపోసి పది ఎకరాలు వేశాను. నారు దశలో హెచ్చుతగ్గులు లేకుండా చదరంగా వుంది. పైరు దశలో కాస్త హెచ్చుతగ్గులు కనపడింది. మామూలుగానే ఎక్కువగా వున్నచోట పైరు ఎత్తుగా, తక్కువగా వున్నచోట తగ్గుగా వున్న దేమోననుకున్నాము. ఇప్పుడు వెన్ను తీసింది; పదిరోజులలో కోతకుకూడా వస్తుంది. ఇప్పుడు కేడి వెన్నులు స్పష్టంగా కనపడుతున్నాయి.

ఎ. పి. సీడ్స్ అంటే ఆటుగడుగుకు పెద్దపెద్ద డిగ్రీలు, హోదాలుకలిగిన అధికార్ల పర్యవేక్షణలో, శాస్త్రీయంగా తయారైన విత్తనంఅన్నమాట. వాటిల్లోకి ఇతరరకాలెట్లా కలిశాయి? ఎక్కడో నిర్లక్ష్యమున్నమాట! ఎవరి బాధ్యతారాహిత్యమోనన్నమాట. లేకుంటే కావాలనిగా తయారుచేయబడే విత్తనంతో ఇతరరకాలెట్లా వస్తాయి?

దీనికి ఎ. పి. సీడ్సు అధికారులు ఏమిసమాధానం చెప్తున్నారో తెలియదు. పొరపాటు, తప్పు, నేరం అన్నీ రైతు

### ఎ. పి. సీడ్స్ విత్తనాల్లో కేడి గింజలు!

కడు రైతునెత్తిన రుద్దబోతారు! రైతువద్ద కేడి విత్తనాలు కలిసివుంటాయని వచ్చు; నారుమడిలో అంతకుముందు పెర్వవుండి వేరేరకం పిలకలుంచి మొలకెత్తి వుండవచ్చు అనవచ్చు; నారువేసిన పొలంలోనే కేడి పైరు మొలిచి వుండవచ్చు; చివరకు కాకులు కొంగలు తెచ్చి ఆకాశాన్నుండి పొలంలో పడవేసి వుండవచ్చునన్నా ఆశ్చర్యంలేదు. కాని

ఇప్పుడు వుదహరించినవిధంగా ఏదశలోనూ 189-69 లో వేరేవిత్తనం కలవడానికి వీలులేదు. ఏపి. సీడ్సువారి విత్తనాన్ని అసలు వరివిత్తనమే లేనిచోట వుంచాము, నారుకయ్యలో అంతకుముందు నీళ్ళు వుండి మొలచివుంటే 9672 కాని, 9674 కాని మొలచి వుండాలి; అట్లనే పొలంలో మొలచి వుండినా ఆ రెండురకాలే వచ్చివుండాలి. కాని ఇప్పుడు 189-69 లోవున్న కేడి రకాలు వెన్ను తీసేసి వున్నాయి; వెన్నుతీయడమేకాదు పాలుపోసి అవిరైతులతో బాటు కోతకుకూడా వచ్చేట్లున్నాయి. అందువల్ల మావద్ద జరిగినపొరపాటుకాదు; ఎ. పి. సీడ్సు వుత్పత్తిలోనే నిర్లక్ష్యం జరిగివుండాలి; సందేహం లేదు.

ఎ. పి. సీడ్సు వ్యయంగా విత్తనాభివృద్ధి క్షేత్రాలను నిర్వహిస్తున్నదా? లేక నమ్మివేటు రైతులకు విత్తనం వుత్పత్తి చేసే బాధ్యతను అప్పగించి పర్యవేక్షిస్తున్నదా? ఏదైనా చివరలో ప్రాసెసింగు జరగాలి; అందులో కలక, పూదక, కె. డి. వంటి ఇతర పదార్థాలన్నీపోయి, విరతమైన విత్తనం మిగలాలి. ఇకంతా జాగ్రత్తగా జరిగితే కేడి విత్తనాలు ఎట్లా వస్తున్నాయి?

గుర్రం గ్రుడ్డిదైనా దాణాకు తక్కువ లేదన్నట్లు, విత్తనం ఎట్లున్నా ధరమాత్రం పక్కాగా పెంచుతుంది. వీళ్ల విత్తనం కిలో రూ 3-70 వుంటుంది; అంటేపుట్టి (850 కిలోలు) పుమారు మూడువేల రూపాయలు! మామూలు ధాన్యంధరకంటే మూడురెట్లు ధర తీసుకొని మంచి విత్తనం సరఫరా చేయలేకపోతే ఎందుకు ఆ సంస్థ?

వ్యవసాయశాఖకూడా రైతులవద్ద విత్తనం సేకరిస్తుంది. సేకరణ మాత్రం చట్టాలు నిబంధనలకు స్ట్రిక్టుగా అనుగుణంగా వుంటుంది; కాని సాధారణంగా ఆ విత్తనం మొలకవచ్చేది అరుదు! వింత నేమంటారా! ఒకసారి నేనే 9672 విత్తనం డిపార్టుమెంటు వద్ద తీసుకుంటే మక్కిపోయి వుంటినాయి; విత్తనం పల్ప గింజవతిపోయాయి. ఆ సంగతిపోనీ; వ్యవసాయశాఖ సేకరించే విత్తనానికి రైతుకు అదనంగా చెల్లించేది మార్కెట్ ధరకంటే పదిశాతం కాదోలు ఎక్కువ; పదిశాతం అదనపు ధరకు స్వచ్ఛమైన విత్తనాన్ని. జాగా ఎండబెట్టి ఇవ్వడం రైతుకు గిట్టుబాటుగా వుంటుందా?

ఒక్కరిసెర్టిఫైడ్ విత్తనంమాత్రం అన్నివిధాల విర్దుష్టంగా వుంటున్నది. అయితే అదికూడా అందుబాటులోవిదర. రైతుకు పుష్కలంగా న్యాయమైన ధరకు ఇటువంటి విత్తనం ప్రభుత్వం అందుబాటుచేయాలి, దానికి విత్తనాభివృద్ధిసంస్థ మరింత కట్టుదిట్టంచేసి, దానిద్వారా మంచి విత్తనం సరఫరా అయ్యేట్లు చూడడం అవసరం. విర్బంది తదితర నిర్వహణ ఖర్చులు ఎక్కువై, విత్తనంధర తగ్గించడానికి వీలులేకుంటే ప్రభుత్వం సబ్సిడీ అయినా యిచ్చి రైతుకు అందుబాటులో నుండేటు చూడడం అవసరం. విత్తనం మంచిదైతే దిగుబడి ఎక్కువగా వుండం

వ్యవసాయశాఖలో డిగ్రీలు ఎట్లా అనమానానికి గురిచేయబడుతున్నాయో ఒక చిన్న వుదాహరణ: ఒక వ్యవసాయ విస్తరణాధికారి; విశేషమైన అనుభవమున్నవాడు, సస్యరక్షణలో ఎంతో వుత్సాహంతో పనిచేసినవాడు. అతను ఇప్పుడు ఎం. ఎస్‌సి (డిగ్రీ) పట్టభద్రుడు;

వ్యవసాయశాస్త్రంలో పోస్టు గ్రాడ్యుయేట్ అయిన ఆ అధికారి ఈనాడు చేస్తున్న పని ఏమిటో తెలుసా? —ఒక తాలూకా కేంద్రంలోని వ్యవసాయ డిపోలో ఎరువులు, విత్తనాలు అమ్మకునే గుమస్తాగా పనిచేస్తున్నాడు. ఎనిమిదవ తరగతి చదువుకున్నవాడు చేయవలసినపనిని పోస్టు గ్రాడ్యుయేట్ చేత చేయిస్తున్నారు! ఇది చదువులను అపహాస్యం చేయడంకాదా? డిగ్రీలను అవమానించడం, దుర్వినియోగపరచడం కాదా? వ్యవసాయశాఖ పట్టభద్రులారా! వ్యవసాయశాస్త్రంలో డిగ్రీలు పొంది చిల్లర కొట్టులోవలె కూర్చొని బిల్లులు వ్రాసుకోవడం మీకు సిగ్గు అనిపించడంలేదా? వ్యవసాయ డిపోలకు తగినంత డిపాజిట్లు తీసుకొని ఎల్. డి. సి. గుమాస్తాలను నియమించడం బాగుంటుంది.

## కూడలి గ్రామాలకు గూడూరని పేర్లు?

గూడూరు పేరుతో అనేక గ్రామాలు అనేచోట్ల వున్నాయి. మచిలీపట్నం దగ్గరగూడూరు, కందుకూరు తాలూకాలో దావగూడూరు (దోవగూడూరు) ఇందులో కొన్ని.

ఆత్మకూరు తాలూకా మహిమలూరు కావనం (నె. శా. ఆ. 38 లో)

పాంకవాటి శిలాశాసనంలోని కొంత "కూడూరు" నాంటికి రాజధానియైన "మహిమలూరు" అనివుంది.

మచిలీపట్నందగ్గర గూడూరు పట్నానికి 4మైళ్ళ దూరంలో వుంది. ఇది ప్రాచీనకాలంనాటి రేవుస్థలము. చైనా, బర్మా మొదలగు దేశాలకు వర్తక వ్యాపారాలు విరివిగా సాగుచుండెడివి. ప్రాచీనకాలమున దీనిని 'కొద్దూర' అని 'టాలమి' అనుసరడు పేర్కొన్నాడు.' (ప్రాచీనాంధ్ర చారిత్రకభూగోళములో)

దోవగూడూరు

కందుకూరుతాలూకాలో దోవగూడూరు

### ఊరు-పేరు
కావింటపర్తి కృష్ణారావు

సింగరాయకొండ కొండపి మార్గంలో వుంది. దోవలు (త్రోవలు) కలయు స్థానముగనుక దీనికి దోవగూడూరని పేరు వచ్చింది. వీటికంతా అర్థం కలయు చోట్లు. సంగమ స్థానాలని అనుకోవాలి.

—కావన 11వ పేజిలో



### కావలి సబ్‌జడ్జివారి కోర్టులో

E P 57/83 N O S 134/82

బెజవాడ లక్ష్మీకాంతమ్మ —పిటిషనరు

1) పుట్టంరెడ్డి చంద్రశేఖరరెడ్డి

2) పుట్టం దశరథరామిరెడ్డి —రెస్పాండెంటు

యీ నెంబరు యీ క్రింది షెడ్యూలుదాఖలా ప్రతివాదులకు హక్కు అనుభవంగల స్థిరాస్తిని తేది 11-6-85వ బహిరంగముగా వేలం వేయబడును పాడదలంచినవారు పై కోర్టులో హాజరై పాడుకొనవచ్చును.

షెడ్యూలు : నెల్లూరు డిస్ట్రిక్టు యిలాకా కావలి సబ్ రిజిష్ట్రారులో చేరిన కావలి తాలూకా అల్లిమడుగు గ్రామంలో 1వ ప్రతివాది తాలూకు హక్కు అనుభవంగల స్థిరాస్తి వివరం :

| వ. నెం. | పట్టా నెం. | సర్వే నెం. | విస్తీర్ణం | అనుభవ విస్తీర్ణం | మాగాణి |
|---|---|---|---|---|---|
| 1) | 586 | 101/2 | 3-40 | 3-40 | మాగాణి |
| 2) | ,, | 102/1 | 3-48 | 3-48 | ,, |
| 3) | ,, | 102/2ఎ | 0-50 | 0-50 | ,, |
| 4) | ,, | 102/2-బి 1 | 0-62 | 0-62 | ,, |
| | | | | 8-00 సెంట్లు | |

నెల్లూరు డిస్ట్రిక్టు యిలాకా కావలి సబ్ రిజిస్ట్రారులో చేరిన కావలి తా॥ అల్లిమడుగు గ్రామంలోని 2వ ప్రతివాది హక్కు అనుభవంగల స్థిరాస్తి వివరం :

| వ. నెం. | పట్టా నెం | సర్వే నెం. | విస్తీర్ణం | అనుభవ విస్తీర్ణం | మాగాణి |
|---|---|---|---|---|---|
| 5) | 581 | 181/1 | 7-78 | 7-78 | మాగాణి |
| 6) | ,, | 181/6 | 2-48 | 2-48 | ,, |
| | | | | యు 10-26 సెంట్లు | |

| | | |
|---|---|---|
| 1 అయిటం | వాది విలువ 10000/- | అమీనా విలువ 18000/- |
| 2 అయిటం | 12000/- | 15000/- |
| 3 అయిటం | 1000/- | 3000/- |
| 4 అయిటం | 2000/- | 4000/- |
| | 38000/- | 60000/- |
| | 6000/- | 10000/- |

మొదలి క్రిష్ణమూర్తి
మొదలి ఈశ్వరప్రసాద్

# సూళ్లూరుపేట కాలేజిలో ఇంగ్లీషుమీడియం కావాలి!

సూళ్లూరుపేట డిగ్రీకాలేజికి సైన్సు తరగతులు, ఇంగ్లీషుమీడియం కూడ ప్రవేశపెట్టాలని శ్రీహరికోట షార్ సిబ్బంది సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ కె. జగ్గారావు రాష్ట్రప్రభుత్వాన్ని కోరారు.

ఎన్నోసంవత్సరాలు ఎదురు చూపు తర్వాత, ఇటీవలే సూళ్లూరుపేటలో ఒక డిగ్రీ కాలేజి స్థాపించారు. అక్కడ ప్రస్తుతం బి.ఎ., బి.కాం. తరగతులు మాత్రమే నడుస్తున్నాయి; అదీ తెలుగు మీడియంలో. అయితే శ్రీహరికోట రాకెట్ కేంద్రం నిర్వహించే సెంట్రల్ స్కూలు ఇంగ్లీషు మీడియంలో నడుస్తూంది. పైగా, రాకెట్ కేంద్రం సిబ్బందిలో తెలుగువారికంటే తమిళులు, ఉత్తరాది వారి సంఖ్య ఎక్కువ. ఇంటర్మీడియెట్ వరకు ఇంగ్లీషులో చదివి, ఒక్కసారిగా తెలుగుమీడియంకు మారాలంటే ఎంతటి ప్రతిభావంతులైన విద్యార్థులైనా అసాధ్యం. భాషరాని విద్యార్థులపరిస్థితి ఇంకా ఘోరం. దీనివల్ల ప్రస్తుతం రాకెట్ కేంద్రం విద్యార్థులంతా ఇటు నెల్లూరుకో, అటు మద్రాసుకో వెళ్లవలసివస్తూంది.

దూరప్రాంతాలలో సీటు సంపాదించడమే కాదు; హాస్టళ్లలో వుంచి చదివించడం కూడా మధ్యతరగతి కుటుంబీకులకు తలకు మించిన పనౌతుంది. ఈ సమస్యలు దృష్టిలో పెట్టుకొని సూళ్లూరుపేట డిగ్రీకాలేజికి ఇంగ్లీషుమీడియం ప్రవేశపెట్టాలని శ్రీ జగ్గారావు కోరారు. అదేవిధంగా అవసరమైన సైన్సు తరగతులు కూడా అంతే అవసరం. ఇంటర్ సైన్సు చదివి, కామర్సు డిగ్రీ తీసుకోవడం విచిత్రం, నిరుపయోగం.

## జిల్లా వార్తలు

ఈ రెండు సౌకర్యాలు కల్పిస్తే ఒక్క రాకెట్ కేంద్రం విద్యార్థులేకాదు; నాయుడుపేట సూళ్లూరుపేట జూనియర్ కాలేజి విద్యార్థులకుకూడా ఎంతో మేలు జరుగుతుంది. డిగ్రీ కాలేజికి విద్యార్థుల కొరతకూడా ఎదురుకాదు.

అంతర్జాతీయంగా భారతదేశ కీర్తి పతాకను, అంతరిక్షం స్థాయిలో రెపరెపలాడిస్తున్న రాకెట్ కేంద్రం సిబ్బంది సంక్షేమం పరిరక్షించడం రాష్ట్ర ప్రభుత్వం కర్తవ్యం; వారి ఈ చిన్న కోరికను తీర్చడానికి జిల్లా నాయకులు కూడా ప్రయత్నించడం అవసరం.

### ఉత్తమ పంచాయితీలు

జిల్లా అంతటిలోకి ఉత్తమ గ్రామ పంచాయితీగా బుచ్చిరెడ్డిపాలెం ఎన్నికైందట: అధికారులు ప్రకటించారు.

—కొనసాగింపు 7వ పేజీలో

# కోర్టుస్టేలలో చిక్కిన కొత్త బస్సురూట్లు

జిల్లాలోని దాదాపు 20రూట్లలో కొత్త బస్సులు ప్రవేశపెట్టడానికి అధికారులు ప్రయత్నిస్తున్నారు. న్యాయపరమైన ఆటంకాలు ఎదురుకాకుంటే, ఒకటిరెండు వారాలలోనే ఈ బస్సులన్నీ తిరగడం ప్రారంభించవచ్చు ననుకుంటున్నారు.

కొత్తగా మంజూరైన బస్సురూట్లు ఇవి—

మోదేగుంటనుంచి వెంకటరెడ్డిపాలెం వయా వెంకటాచలసత్రం, పర్వేపల్లి; పూడిపర్తి నెల్లూరలమధ్య రెండు బస్సులు; పల్లిపాడు- వేదాయపాలెం, ఎజ్జిఒకాలనీ- చిన్నచెరుకూరుల మధ్య రెండు టౌనుబస్సులు; నెల్లూరు- గోగులపల్లె వయా జొన్నవాడ, అల్లూరు; నెల్లూరు- ఇస్కపల్లె వయా అల్లూరు; గోగులపల్లె- కావలి వయా అల్లూరు; చంద్రశేఖరపురం- వేములపాడు (ఉదయగిరి తాలూకా); నెల్లూరు- ఊటుకూరు.

ఇవికాక కృష్ణాపట్నం, గోపాలపురం, ముత్తుకూరు తదితర గ్రామాలకు కొత్తగా బస్సులువేసే ప్రతిపాదనకూడా ఒకటి పరిశీలనలో వుందట. దాని విషయంలో ఇంకా ఒక తుదినిర్ణయం జరిగినట్లులేదు.

అయితే ఇప్పుడు మంజూరుచేసిన రూట్లలో చాలావరకు కోర్టు స్టేవల్ల నిలిచిపోయే ప్రమాదం ఏర్పడింది. ఇప్పటికే ఇస్కపల్లి, గోగులపల్లె తదితర రూట్లు స్టేవల్ల నిలిచిపోయాయట. మిగిలినవాటి పరిస్థితికూడా అంతేకావచ్చు.

నిజానికి ఇవేకాదు, జిల్లాలో ప్రతి రూట్‌లోను కొత్తబస్సులు ప్రవేశపెట్టవలసి వుంది. ఏ ఒక్కరూట్‌లోనూ చాలినన్ని బస్సులు లేవు. నెల్లూరుకు అత్యంత సమీపంలో వుండే సైపాడు, ఇనమడుగు, ముత్తుకూరు, తదితర గ్రామాలకే బస్సుల కొరత వుంది. పలు రూట్లలో ప్రయాణీకులు టాప్‌లపై ప్రయాణించవలసి వస్తూంది.

పొదలకూరు, చేజెర్ల, తూర్పుకంభంపాడు తదితర గ్రామాలలో బస్సుల పరిస్థితి మరీ దారుణం. కాలు పెట్టడానికి సందు వుండదు; కమ్మిపట్టుకొని వ్రేలాడడానికీ ఖాళీ వుండదు.

పురిణి, గోగులపల్లె పూడిపర్తి, పర్వేపల్లి, ఈపూరు, తదితర గ్రామాలకు పేరుకు బస్సులు వున్నాయి; కానీ అవసరాలలో సగంకూడా తీర్చలేకున్నాయి. ముత్తుకూరు రూట్‌లో మరొక 10 బస్సులు వేసినా తక్కువే; జొన్నవాడకు అదనపు బస్సులు అత్యవసరం. ముబ్బూడి రూట్‌లోకూడా కొత్తబస్సుల అవసరం వుంది.

టౌనుబస్సుల సంఖ్యను రెట్టింపు

—కొనసాగింపు 8వ పేజీలో

# హాహాకారాలు లేకున్నా నీటి కొరత తీవ్రంగానే వుంది!

నెల్లూరు టౌనులో మంచినీటి కరవు కాగడాపెట్టి వెతికినా కన్పించడంలేదని పురపాలక సంఘం ప్రచారం చేసుకుంటున్నప్పటికీ, టౌనులోని పలుప్రాంతాలలో జనం నీళ్లకోసం ఇబ్బందులు పడవలసి వస్తూంది. హాహాకారాలు చేసే పరిస్థితి లేదుకాని, అంతా మామూలుగానే అన్నట్లు వుందని భావించడం మాత్రం భావ్యంకాదు. అధికారులు ఉపేక్షిస్తే, లేదంటే పోయేసమస్య కాదు నీటికొరత. అనుదినం ప్రజలు ఎదుర్కొనే ఇబ్బంది అది, దాన్ని కప్పిపెట్టచూడడం, లేనట్లుచూపడం అసాధ్యం.

## సింహపురి సమస్యలు

వర్కాడవారి లెక్కప్రకారం పట్టణంలో ప్రతి పౌరుడికి సగటున రోజుకు 30 గ్యాలన్లనీరు అవసరమట. ఆ లెక్క ప్రకారం రెండులక్షలా 22 వేల నెల్లూరు జనాభాకు 66 లక్షల గ్యాలన్ల నీరు కావాలి. కాని ప్రస్తుతంవున్న అన్ని వనరులు కల్పితే 52 లక్షలా 50 వేల గ్యాలన్ల నీరు మాత్రమే సరఫరా చేయగల వసతి వుందని కమీషనర్ శ్రీ ఐ. నరసింహం చెప్పారు. వారి అంచనా ప్రకారమే దాదాపు 50 వేల మంది ప్రజలకు నీరు సరఫరా కావడంలేదు. నిజానికి నెల్లూరు టౌను జనాభా దాదాపు 3 లక్షలు సమీపిస్తూంది. నిత్యం పల్లెలనుంచి వచ్చిపోయేవారి సంఖ్యకూడా వేలల్లోనే వుంటుంది. ఇవన్నీ కలుపుకుంటే చాలు, స్థూలంగా నీటి సమస్య ఎంత తీవ్రంగా వుందో అర్థం చేసుకోవడానికి.

నెల్లూరుకు నీటిసరఫరా చేసేందుకు ప్రస్తుతం రెండంటే రెండు పథకాలు వున్నాయి. పెన్నలోని ఇన్‌ఫిల్ట్రేషన్ గ్యాలరీలలో 4 లక్షల 65 వేలు, మూలపేట నీటిపథకంలో 2 లక్షలా 87 వేల గ్యాలన్ల నీరు సరఫరాచేసే వసతివుంది. నెల్లూరీయుల అదృష్టం- ఇప్పుడు ఇవన్నీ ఇబ్బంది పెట్టకుండా పనిచేస్తున్నాయి. పెన్నలో మొదటమొదట కొద్దిగా నీటి కొరత ఎదురైంది కాని సంగంనుంచి ఒక కాల్వద్వారా ఆ ఆటంకం తొలగించారు.

ఈ రెండు పెద్దపథకాలుకాక అక్కడక్కడా ఇటీవల మినీ నీటిపథకాలు కట్టారు.

పొదలకూరురోడ్డు, స్టోన్‌హౌస్ పేటలలో మరొక రెండు నిర్మాణంలో వున్నాయి.

పొదలకూరు రోడ్డు రిజర్వాయర్ రెండు లక్షల గ్యాలన్ల స్టోరేజి కల్గిన పథకం; అధికారులు అంచనావేసినట్లు మరొక రెండు నెలలలో ఇది పూర్తయితే దర్గామిట్ట జనాభా నీటిసమస్యనుంచి విముక్తి చెందుతుంది. స్టోన్‌హౌస్‌పేట ట్యాంకు

—కొనసాగింపు 8వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

## విహార్మకుడు

### రామానాయుడు జయంతి

'జమీన్‌రైతు' స్థాపక సంపాదకుడు స్వర్గీయ నెల్లూరు వెంకటరామానాయుడు గారి జయంతి జూన్ 8 తేది సాయంత్రం 6-30 కు టవున్‌హాలులో జరుగుతుంది.

జర్నలిజంతో వృత్తి విడుగని వించుకున్న యు.ఎన్.ఐ. హైదరాబాదు శాఖాధిపతి శ్రీ డి. సీతారాం జర్నలిజం మీద ప్రసంగించి రామానాయుడుగారి పేరుతో గావించబడే సత్కారాన్ని స్వీకరిస్తారు. మీదాటు గవర్నరు శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్యగారు అధ్యక్షత వహిస్తారు. టైమ్స్ ఆఫ్ ఇండియా మద్రాసు ప్రత్యేక విలేఖరి శ్రీ వి. జి. ప్రసాదరావు ప్రసంగిస్తారు.

'జమీన్‌రైతు' పాఠకులకి అభిమానులకు శ్రేయోభిలాషులకు ఇదే సాదర పూర్వక ఆహ్వానం.

### మంత్రి శ్రీనివాసులురెడ్డి

రెవిన్యూమంత్రి శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి నిన్న (9 తేది) పొదలకూరులో సబ్‌ట్రెజరీని ప్రారంభించి ఆకాలూరులో పర్యటించారు. ఈరోజు (10తేది) నాయుడుపేట ట్రెజరీకి ప్రారంభోత్సవం జరిపి ఆప్రాంతంలో పర్యటిస్తున్నారు. 11 తేది తన స్వంతనియోజకవర్గమైన కోవూరును సందర్శించి రాత్రి హైదరాబాదు రైలెక్కుతారు.

'ఆకాశవాణి' నెల్లూరు ప్రసారసంబంధ కాల అతీసంలో వుందేమో! మంత్రిగారి పర్యటన ప్రసంగాల వివరాలు ఎప్పటికప్పుడు అందుల వచ్చేస్తున్నాయి. ఏ శ్రీ పత్రికలో ఇవ్వటం చర్విత చర్వణంగా వుంటుంది.

### జనార్దనరెడ్డి

శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి 10తేది నెల్లూరువచ్చి. తిరుపతిపోతారు. తిరుగా 11 తేది వస్తారు. 12 13 తేదులలో కూడా వుండి 14 తేది హైదరాబాదు పోయేట్లుంది.

### కావలి ప్రజాభివందన సభ

12 తేది సాయంత్రం కావలిలో కాంగ్రెస్ విజయోత్సవ చిహ్నంగా ప్రజాభివందన సభ జరుగుతుంది.

శ్రీ ఎన్. జనార్దనరెడ్డి అధ్యక్షత వహిస్తారు. శ్రీ కే. రోశయ్య; శ్రీమతులు జమున. వన్నపనేని రాజకుమారి, నెల్లూరు-ప్రకాశం జిల్లాల కాంగ్రెస్ శాసనసభ్యులు పాల్గొని ప్రసంగిస్తారు.

రాత్రికి ఆనాటిరెడ్డిగారి స్పెషల్ డిన్నర్.

### వాయుదూత్‌కోసం ప్రయత్నం

హైదరాబాద్- నెల్లూరు మధ్యకూడా వాయుదూత్ సర్వీస్ ప్రారంభించవలసిందిగా శ్రీ జనార్దనరెడ్డి మొన్న ఢిల్లీలో విమానయాన మంత్రి శ్రీ అశోక్ గెహ్లాట్‌ను కలుసుకొని విజ్ఞప్తి చేసినట్లు: నెల్లూరులో ఏర్పాటువసతివుంటే వాయుదూత్ సర్వీస్‌ను నెల్లూరుకుకూడా విస్తరింప చేయగలమని ఆయన మాటఇచ్చినట్లు తెలుస్తున్నది.

యుద్ధకాలంలో రైల్వే లైను కు తూర్పుగా. భక్తవత్సలనగర్ - వేదాయపాలెం స్టేషన్ల మధ్య విమానాశ్రయానికి స్థలంవుండేది. ఇప్పుడది ఖాళీగావుందో! ఆక్రమణై పోయిందో తెలియదు. జనార్దనరెడ్డి ఈ విమానాశ్రయస్థలంవిషయం కలెక్టరు కుమారి సుజాతారావుగారితో హైదరాబాదునుండి ఫోన్లో మాట్లాడినప్పుడు. అస్థలం ఖాళీగావుందేది లేనిది పరిశీలించమని, ఖాళీగావుంచేమని. ఆక్రమణలలోవున్నా వాటిని ఖాళీ చేయించ గలమనిచెప్పిందట. కలెక్టరుగారు కావాలను కుంటే విమానాశ్రయానికి గంటల్లో తగినస్థలం కేటాయింపకాదా!

మీకు జ్ఞాపకంవుందోలేదో. జనార్దనరెడ్డి పూర్వస్థితిలో వున్నపుడు, అంటే చెన్నారెడ్డి ముఖ్యమంత్రిత్వ హయాంలోనే, నెల్లూరుకు విమానసౌకర్యాన్ని కల్గించడానికి తీవ్రంగా ప్రయత్నించారు. సంజయ్‌గాంధీతోమాట్లాడి. ఆనాటి మంత్రి ఖురేషీనికూడా ఒప్పించారు. సివిల్ అవియేషన్ డైరెక్టరుగా వుండిన పట్టాభిరామన్‌తోకూడా చర్చించారు ఈ ఫీడర్ సర్వీసుల విభాగానికి డిప్యూటీ డైరెక్టరు జనరల్ శ్రీ స్వామినాథన్ ఛైర్మెన్‌గా కూడా నియమింపబడినట్లు జ్ఞాపకం.

అప్పుడు రావలసిన ఉత్వం నెల్లూరు వరంగల్ రాజమండ్రి. శ్రీశైలం. వేములవాడ. తిరుమల. కడప నగరాపట్టణాలకు వాయుదూత్ సర్వీస్‌సౌకర్యం కల్గించాలని ప్రతిపాదించింది. రాజకీయంగా వచ్చిన ఒడిదుడుకులవల్ల అప్పటి ప్రయత్నము. ప్రతిపాదన మూలపడిపోయాయి. ఇప్పుడైనా వాయుదూత్ సర్వీస్ నెల్లూరుకు విస్తరింపబడికే సంతోషించవచ్చు.

తిరుపతి పార్లమెంటు సభ్యుడు శ్రీ చింతా మోహన్‌కూడా ప్రధానిని కలసుకున్నప్పుడు. నెల్లూరుకుకూడా వాయుదూత్ సర్వీసును విస్తరింపజేయమని కోరానని, ప్రధాని సుముఖతచూపారని చెప్పారు.

### రమణయ్యకు అరుపదులు పూర్తి

నిరంతర వార్తాన్వేషి. నిత్య యవ్వనుడు, ఆంధ్రజ్యోతి విలేఖరి శ్రీ జి.వి. రమణయ్యకు అరువదులు నిండిన ఉత్సవాన్ని 7 తేది టౌనుహాలులో జరిపారు. శ్రీ వత్తి సుబ్బారావు అధ్యక్షత: జర్నలిస్టుల సంఘ రాష్ట్రాధ్యక్షుడు శ్రీ జి ఉపేంద్రబాబు జ్యోతిచిత్ర సంపాదకుడు శ్రీ కుర్లపాటి కుటుంబరావు, శ్రీయుతుల ఏ. సి. రెడ్డి. కె.వి. రమణయ్య. తుంగా రాజగోపాలరెడ్డి, డాక్టర్ వై. జె. ప్రభాకర్‌రెడ్డి తదితరుల అభినందన ప్రసంగాలు; అతర్వాత పి. వి. కృష్ణయ్య దంపతులచే రమణయ్య జంటకు సన్మానం....క్రమబద్ధంగాజరిగిపోయాయి. మిత్రులు, అభిమానులు పెక్కుమంది పాల్గొన్నారు.

### మార్కెట్ రభస

ఏ సి కూరగాయల మార్కెట్ ఏటా వేలంపాటల సమయంలో తప్పకెక్కుతూంది; రభసగా తయారౌతూంది. ఈ ఏడాదీ అంతే!

మార్కెట్‌లో బాడుగలు వసూలుచేసే హక్కును ఒక కంట్రాక్టరు ఏలంపాడుకున్నారు. మామూలుగా ఈ కాంట్రాక్టు కూరగాయల వ్యాపారులకే దక్కుతుండేది. ఈఏడుబయటవ్యక్తికావడంతో

—కొరవ 7వ పేజీలో

# మూసలోనుండి వచ్చే మట్టిబొమ్మలు మనచిత్రాలు!

డోతేంద్ర

తెలుగు చిత్రసీమ భావదారిద్ర్యానికి పుట్టినిల్లు. నూతనత్వాన్ని వరించలేని నిర్మాతల పిరికితనం, పాతమూసలో కొట్టుకుపోయే గొర్రెదాటు తత్వం, సెంటిమెంట్ల బంధాలనుంచి విముక్తికాలేని బలహీన మనస్తత్వం చిత్రసీమలో భావదారిద్ర్యాన్ని పెంచి పోషించి, పుష్టికరం చేశాయి.

ఇప్పటిది కాదు. ఈ అవాంఛనీయ ధోరణి. లక్షమ్మ, శ్రీలక్ష్మమ్మ చిత్రాలు పోటీపడి నిర్మించిననాటినుంచే పరిశ్రమ తప్పటడుగులు వేస్తూవుంటూంది. ఘనంగా వజ్రోత్సవం జరుపుకున్నప్పటికీ పరిశ్రమ ఈ పోకడనుంచి మాత్రం బయటపడలేకపోతూంది.

తెలుగుచిత్రాల విజయపరంపరలు "సీజన్"వారీగా వుంటాయి. ఎవరైనా ఒక నిర్మాతో, దర్శకుడో తెగించి, తనకుతాను ధైర్యం చెప్పుకొని ఒకకొత్త తరహాచిత్రం తీసి, అది విజయవంతమైతే చాలు-నిర్మాతలందరూ హోల్మొత్తంగా పోలోమని అమాంతం ఎగబడుతున్నారు. పాతకాలంలో చిత్రాలు మూడేరకాలు పౌరాణికాలు, జానపదాలు, సాంఘికాలు... కథకులు బదులు, నటీనటులు, పైపై మెరుగులుతప్ప ఈచిత్రాలన్నీ ఒక కోవలోనే వచ్చేవి

'దసరాబుల్లోడు' వచ్చి ద్యూయెట్లకు ప్రాణంపోశాడు. ఆతర్వాత కుప్పిగంతులే ప్రధానంగా ఎన్నిచిత్రాలు వచ్చాయో చెప్పలేము.

తాతా మనవడు, పిలలేని ఆ రది చిత్రాలలో కొత్తపటులు ప్రయోగించారు, అది విజయవంతం కావడంతో అందరూ దానికి మళ్ళుకున్నారు. జీవనతరంగాలతో నవలాచిత్రాలు కొన్నాళ్ళు రాజ్యం చేశాయి.

ఇటీవలి శంకరాభరణం చూస్తేచాలు: అది ఎన్ని సంగీత ప్రధానచిత్రాలకు జన్మనిచ్చిందో అందరెరిగిన సత్యమే.

హాస్యప్రధానంగా ఏమండోయ్ శ్రీవారు సవలీకృతమైంది; కొన్నాళ్ళు అటువరుగులు పెట్టారు. జంధ్యాల, రేలంగి నరసింహారావు ఒకరికొకరు పోటీలుపడి కాపీలుతీశారు.

విప్లవంమార్కు-ఫార్ములాలో మాదాల రంగారావు పక్కాఫిల్ములు మనకు తెలియనివి కావు.

ఎవరో ఒకరు ప్రయోగించి, పైకి తెచ్చిన మూసకథలుతప్ప, స్వయంగా సృజనాత్మకంగా, నూతన కథాంశాలను చిత్రవస్తువులుగా తీసుకోవాలనే ఆలోచనే మననిర్మాతలు, దర్శకులలో కల్గడం లేదు. ఇప్పుడొస్తున్న ఏరెండు చిత్రాలు చూసినా ఈసంగతి సుస్పష్టమౌతుంది. ఈతప్పు ప్రేక్షకులదిమాత్రంకాదు, కొత్తదనాన్ని కాంక్షించడంలో, ఆదరించడంలో తెలుగుప్రేక్షకులు ఎప్పుడూ ముందునిలుస్తారు. కానీ ప్రేక్షకులలోని కళాతృష్ణను తీర్చడంలో దర్శకులే విఫలమవుతున్నారు.

పేర్లమోజుమాని చూదాం. మన "పారిశ్రామికుల" భావదారిద్ర్యం అర్థం చేసుకోడానికి, కెనె రవము, మూగమనసులు ఒకరకంగా వచ్చాయి; దొంగరాముడు, జగదాముడు సంగతి సరేసరి, ఇంకా వెనక్కుపోతే రాజకోటరహస్యానికి, రాజపుత్ర రహస్యానికి తేడా తెలిసేదికాదు. ముందుకువస్తే అడగాలా, వేటగాడు, సోగ్గాడు....'గాడు' అనిపించుకోనిదే చిత్రం సక్సెస్ కాదనే మూఢ నమ్మకం రాజ్యంచేసింది. ఇటువంటి సాదృశ్యాలు పరిశ్రమలో ఎన్నో ఎన్నెన్నో....?

ఇతర భాషాచిత్రాలతో పోల్చుకుంటే మనం యీ విషయంలో ఎంతో వెనుకబడివున్నాం. బెంగాలీభాషలో వెలువడే ప్రతిచిత్రమూ, కొత్తరకంగానే వుంటుందట. తమిళంలోకూడా ఇటీవల సృజనాత్మకమైన చిత్రాలు వస్తున్నాయి. తెలుగువారి దౌర్భాగ్యమేమో, కథమారదు, కథనం మారదు, పాటలరాగం మారదు, ఆఖరకు ఔట్‌డోరు లొకేషన్లుకూడా మారవు. అంతా మూసలోనుంచి తీసిన మట్టిబొమ్మలే!

నిత్యజీవిత వాస్తవాలను: చారిత్రక సంఘటనలను, ఉద్యమాలను, సాంఘిక సమస్యలను కథావస్తువుగా తీసుకొని చిత్తశుద్ధితో చిత్రాలునిర్మించే దర్శకులు రానంతకాలం ఈ దౌర్భాగ్య పరిస్థితి తప్పదు.

——

## సమస్య పాతదే- కాని రాజాచంద్ర దర్శకత్వంలో కొత్తదనం పొందిన చిత్రం

# ఓ తండ్రి తీర్పు

సమీక్ష
❖
గ్రిద్దలూరు గోపాలరావు

ఎక్కడో ఎప్పుడో తప్పితే ఎక్కువగా కొడుకులు పెద్దవాళ్ళు ఐన తర్వాత ముఖ్యంగా వివాహమైన తర్వాత తల్లిదండ్రులను నిర్లక్ష్యం చేస్తుంటారు. తల్లిదండ్రులకు తిండిపెట్టడంగూడా కష్టపడే కొడుకులున్నారు. ఇంటినుంచి బైటకు గెంటబడ్డ తల్లిదండ్రులూ వున్నారు. ఇలా కొడుకులు కోడళ్ళ నిర్లక్ష్యానికి గురై అనాథల్లా బాధలుపడే వయసు మళ్ళిన తల్లిదండ్రులకు వారికిగా ఒక యిల్లంటూ కల్పించి, వారుచేసే పనంటూ ఒకటి చూపించి, వారిచేతనైనంత వారు సంపాదించి, వారికి అందినంత వారి ఆహారం వారు తింటూ రోజులుచూస్తూ బ్రతుక్కుండా చచ్చేంతవరకు హాయిగా కాలక్షేపంచేసే అవకాశాలు సమాజమూ, సర్కారువారు కల్పించటం ఎంతైనా అవసరం. అనాథ పిల్లలకు బాలసదనాలున్నట్టు వృద్ధులకు గూడా వుంటే స్వార్థపరులైన కొడుకుల కోడళ్ళ చేతుల్లో బలిపశువులు కాకుండా వుంటారు. ఈ ముఖ్యాంశాన్ని రాజాచంద్ర దర్శకత్వంలో తయారైన "ఓ తండ్రి తీర్పు" చెప్తుంది. అంతేకాదు బంధుత్వంకంటె మిత్రులేమేలు; రక్తం పంచుకుని పుట్టిన సంతానంకంటె, చెంత చేర్చి నమ్మిన సాకల్లె ఎంతోమేలు అని గూడా చెప్తుంది యీ చిత్రం.

రామచంద్రరావు (మురళీమోహన్) పేరు మోసిన మోటారు మెకానిక్. సీత (జయసుధ) అనే శ్రీమంతుల అమ్మాయి ఇతన్ని ప్రేమించి, సిరిసంపదలు వదలుకొని ఇతన్ని పెండ్లి చేసుకొని పేద యింట్లోకి మకాం మారుస్తుంది. వీరికి కలిగిన రమేష్ సురేష్‌లను వారి రెండుకళ్ళుగా, రెండు చేతులుగా భావిస్తారు తల్లిదండ్రులు. రాత్రింబవళ్ళు కష్టపడి సంపాదించి కొడుకులను బాగా చదివిస్తారు. రమేష్ బ్యాంకిలో పనిచేస్తాడు. సురేష్ ఇంజనీరు పాసవుతాడు. చక్రధరరావు

—కొసవ 11 వ పేజీలో

## ప్రకటన

నెల్లూరుజిల్లా పొదలకూరు తాలూకా మొగళ్ళూరు గ్రామ కాపురస్తుడు కృష్ణం చినవీరరాఘవశెట్టి కుమారుడు యానాదిశెట్టి చేయు ప్రకటన.

నా రెండవ కుమారుడగు కృష్ణం రామయ్య మా కుటుంబ ఆస్తులలో తనకు రావలసిన వాటాను క్రయముగా తీసుకొని తేది 15-6-83 న హక్కు విడుదల పత్రము వ్రాయించి రిజిష్టరు చేయించి యిచ్చియున్నాడు. కావున మా కుటుంబ ఆస్తులలో సదరు కృష్ణం రామయ్యకు ఎలాంటి హక్కు లేదు అతనుచేయు బాకీలకు మా కుటుంబీకులకు గాని మా కుటుంబ ఆస్తులకుగాని ఎలాంటి బాధ్యత లేదని యిందుమూలముగా యావన్మందికి తెలియజేయడమైనది.

కృష్ణం యానాదిశెట్టి
మొగళ్ళూరు

## ప్రకటన

To whom so ever may concern over.

ఇందుమూలకముగా యావన్మందికి, తెలియజేయడమేమనగా శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానము, స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు తాలూకు నెం. 42 రు గల రశీదు పుస్తకము దేవస్థానము ఆవరణలోని వాలు బల్లమీద వుంచగా ఆ రశీదు పుస్తకములోని నెం. 4114 రు. గల రశీదుయొక్క original ను ఎవరో చించివేసినారు ఆ రశీదుకో ఛైర్మెన్‌గారి సంతకము వున్నది. ఆ రశీదు క్రింద పై దేవస్థానమునకు ఏలాటి జమరాలేదు సదరు రశీదును ఎవరైన దుర్వినియోగం చేసి అక్రమలాభము పొందదలచి సదరు రశీదును ఉపయోగించినవారిపై సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకొనబడును, అట్టి వినియోగం దేవస్థానమును బద్ధగించదు. సదరు రశీదును ఎవరైనను దేవస్థానమునకు చేర్పినయెడల తగుపైన పారితోషికము ఇవ్వబడును.

—కోట సుబ్రహ్మణ్యం
ఛైర్మెన్,
శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానం
స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు-2

# జిల్లా కాంగ్రెస్ (2వ పేజీ కొరవ)

పోయినా అది పార్టీ ప్రసాదితమేననే స్పృహ వున్నపుడు, ఎంత చిన్నవారైనా ఎంత పెద్దవాడైన వ్యక్తి సైతం పార్టీ పదవిని పొందలేరన్న వాస్తవం కఠినపరంగా భావించాలనిపిస్తుంది.

ఏం. జిల్లాకాంగ్రెస్ అధ్యక్షతకు జనార్ధనరెడ్డికే పోటీలున్నాయా, అంతె వ్యరూలేవా అని ప్రశ్నించేవారు వుండకుండాపోరు. ఈ పరిస్థితుల్లో జిల్లాలో కాంగ్రెసును పటిష్టంగా నిర్మించి పూర్వ ప్రాభవానికి తీసుకరాగలిగినవ్యక్తి జనార్ధనరెడ్డి తప్ప మరొకరులేరు అనిఘంటాపథంగా చెప్పవచ్చు. ఈనాడు జిల్లాలోని అన్ని ప్రాంతాలలో, అందరు కాంగ్రెస్ వాదులతో సంబంధాలు కలిగినవారు; వాళ్ళందరినీ ముందే చెప్పినట్లు సమీకరించగలిగినవారు, సంఘటిత పరచగలిగినవారు జనార్ధనరెడ్డి ఒక్కరే. 1983లో, అతర్వాత జిల్లాలో కాంగ్రెస్ పెద్దలమనుకునేవాళ్ళందరూ పనుపువచ్చి తంగు పూసుకున్నారు; కాషాయాన్ని ఆరాధించారు. అటువంటివాళ్ళలో ఒకరిద్దరు అవకాశవాదంగా వచ్చి మళ్ళీ కాంగ్రెస్‌లో రాసుకోవడంచూడవచ్చు; దానిగొప్పగా కాంగ్రెస్ విజయానికి పనిచేసినట్లు బయట నాయకులను భ్రమకల్పించడానికి ప్రయత్నించవచ్చు; కానికొందరు మొన్న మార్చితో కూడా ఒక నియోజకవర్గంలో కాంగ్రెసుకు; పరిశిష్ట నియోజకవర్గంలో తెలుగుదేశానికిచేశారు. అంతేకాదు తమ కుటుంబసభ్యుల చేత కాంగ్రెస్ అభ్యర్థిత్వానికి దరఖాస్తు పెట్టించి, అతని సెంక్షను కృషిచేసి, చివరకు ఆ నియోజకవర్గంలో తమవాడే తెలుగుదేశం అభ్యర్థి అయ్యేటట్టు చేసి ఆ "కుటుంబాన్నే" ఆ తెలుగుదేశం అభ్యర్థికి అప్పగించిన పెద్దవారున్నారు. ఇంతకంత ఎందుకు ఏకరువు పెట్టవలసివస్తున్నదంటే, ఇటువంటి కాంగ్రెస్‌వాదులుగా చెలామణి అవుతున్న కొందరు మిత్రులు ఇంకా అవకాశవాదాన్ని వదలిపెట్టలేదని చెప్పడానికే.

రెవిన్యూశాఖామాత్యులు నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారికి ఒక వూతపదం వుంది— "పోమ్మనలేను; పోకూడదు" అని. జిల్లాకాంగ్రెస్ అధ్యక్షతకు సంబంధించికూడా కష్టం ఒకరిది, ఫలితం ఇంకొకరిది కాకూడదనేదే; కష్టసుఖాల్లో విశ్వాసపాత్రంగా సంస్థను కనిపెట్టుకొని వున్నవారు, క్లిష్టసమయంలో తెప్పరిగ లేనివారు ఒకటి కాకూడదనేదే కాంగ్రెస్‌వాదుల అభిమతం. అంతే కాని వ్యక్తిగత ద్వేషాసూయలు, వర్గతత్వంతో చేస్తున్న విమర్శకాదు. వెంగళరావుగారు ప్రకటించినట్లు రాష్ట్రంలో కాంగ్రెస్ నేడున్న దైన్య స్థితిలో కాంగ్రెస్‌లో చేసే ప్రతిఒక్కరికి త్యాగబుద్ధి కలిగివుండాలి; అయితే అచేతనం చిత్తశుద్ధితో, సంస్థపట్ల భక్తివిశ్వాసాలతో కూడినదైవుండాలి.

జిల్లాలో 1983 లో కాంగ్రెస్ పరాజయమైనప్పటినుండి ఆశాభంగంతోనో, నిరుత్సాహంతోనో ఇంట్లో కూర్చుండా, అవకాశవాదానికి లోనుగాకుండా; తన కాలాన్ని శక్తిని పనిని పరిపూర్ణంగా కాంగ్రెస్ పునరుజ్జీవనానికి ధారపోసిన వ్యక్తి శ్రీ జనార్ధనరెడ్డి కాంగ్రెస్‌చేతిలో వుండిన జిల్లాపరిషత్తు తెలుగుదేశం వశమైపోయింది; అదేవిధంగా ఎన్నో పంచాయతీ సమితులు కాంగ్రెస్ చేజారిపోయాయి; కాంగ్రెస్ ప్రభుత్వంలో, తన అధికారంలో తనకు సన్నిహితులైన వారు, తనవల్ల అన్ని విధాల లాభం పొందినవారు ఎంతోమంది జనార్ధనరెడ్డికి దూరమైనారు.. అయినా జనార్ధనరెడ్డి తన యావచ్ఛక్తిని వినియోగించి జిల్లాలో కాంగ్రెస్‌ను పటిష్టమేకాదు, బలమైన సంస్థగా నిలపగలిగారు. ఎన్నోసందర్భాలలో, ఎన్నో అవకాశాలను కల్పించి తరచు కాంగ్రెస్ వాదులను ఒకచోట చేర్చి వారిలో ఉత్సాహం పాదుకొల్పారు. ముప్పయ్ ఏళ్ళుగా ఎవ్వరూ చేయతలపెట్టని కాంగ్రెస్ భవన నిర్మాణాన్ని చేపట్టి; అధికారం లేకపోయినా; అధికారంలేని కారణంగా ఎదురయ్యే అవాంతరాలు, అవమానాన్ని సైతం దిగమ్రింగి తన వ్యక్తిగతమైన పలుకుబడిని, మంచితనాన్ని వినియోగించి బ్రహ్మాండమైన కాంగ్రెస్ భవన నిర్మాణాన్ని చివరిదశకు తీసుకొచ్చారు; రేపు జూన్‌లో పరిపాలనా రాజీవ్‌గాంధీ చేత దానికి ప్రవేశోత్సవం జరిపించబోతున్నారు. ఈ మూడేళ్ళుగా జిల్లాలో కాంగ్రెస్ పునరుజ్జీవనానికి చేసినకృషి సత్ఫలితం మొన్న శాసనసభ ఎన్నికలలో కనపడింది; 1983 లో ఒక్కస్థానంరాని కాంగ్రెసుకు, 1985లో నాలుగుస్థానాలొచ్చాయి.

ఈవిధంగా జనార్ధనరెడ్డి ప్రత్యేకంగా ఈమూడేళ్లనుండి అవిశ్రాంతంగా చేసిన కృషిద్వారా జిల్లాలో కాంగ్రెస్ నాయకత్వానికి అర్హతను, హక్కును జనార్ధనరెడ్డి సహజంగా సంపాదించుకున్నారు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షత అనేది జనార్ధనరెడ్డికి చిన్నది కావచ్చు; కాని జనార్ధనరెడ్డి నాయకత్వం వల్ల దానిస్థాయి పెరుగుతుంది; దానికి పెద్దరికం వస్తుంది. పిసిసి అధ్యక్షుడైన శ్రీ వెంగళరావు వాస్తవికవాది; ఆయన చర్యలు వాస్తవికంగా వుంటాయి, జిల్లా కాంగ్రెస్ విషయంలోకాని, జిల్లాలోని కాంగ్రెస్ వాదులకు సంబంధించికాని ఆయన పొరపాటు పడబోరనే నమ్మకం అందరికీ దృఢంగావుంది. —

# పినాకినీతీరం (2వ పేజీ కొరవ)

దేది; ఇప్పటివిలేఖరి వివాదాస్పదుడుకాక తప్పదు. కాని రమణయ్యమాత్రం ఆ పాత విలేఖరిత్వ స్వరూప స్వభావాలను అట్లనేకాపాడుకొస్తున్నాడని చెప్పాలి;

రమణయ్య విలేఖరిత్వంలోని ప్రత్యేకత వార్తలో వివాదకరంగావున్న అంశాన్ని వదిలేస్తాడు; అతను రాజకీయవాదికాని, మరొకడుకాని అతనిలోకాని, అతని చర్యలోకాని లోపం తప్పువుంటే వాటిని వదిలేసి మంచివరకే —బయటకు కనపడుతున్నంతవరకే, అందరికి తెలిసినంతవరకే తీసుకొని వ్రాస్తాడు. అతికార్లకు వ్యతిరేకంగా అక్షరం వ్రాయడు; అందునా పోలిస్‌వాళ్ళను కించిత్‌కూడా అసంతృప్తి పరచడు. వ్యక్తిగతంగాతప్ప పార్టీ అనుబంధాలు, వర్గతత్వాలు, మతాభిమానాలు .ఇటువంటివేమీ రమణయ్యలో వెతికినాకనపడవు వివాదమున్నచోట, విమర్శలున్నచోట, పోరాటాలున్నచోట రమణయ్య వుండడు; అటువంటివాటిని కాగితంమీద ఎక్కించడానికి అతనికలం తిరస్కరిస్తుంది. అతనికి అందరూఒకటే, అన్నీ ఒకటే,. సత్యమానవ సౌభ్రాతృత్వానికి, సత్యప్రియత్వానికి పటిష్ప్రతీక శ్రీ రమణయ్య. అందువల్లనే నలభై ఏళ్ళుగా విలేఖరిగా వుంటే, ఆయన ధోరణులు నైజాలు గిట్టనివారువుంటే వుండవచ్చుకాని, రమణయ్యకు పలుగురుకూడా వ్యతిరేకులులేరు, వారు విలేఖరులుగాని, పత్రికా రచయితలుగాని అటువంటి అదృష్టం ఎంతమందికి కలుగుతుంది?

ఏ వార్తకు సంబంధించైనా అవలు విషయాన్ని తెలిసికొందామని ఎన్ని సార్లు విశ్వప్రయత్నంచేసినా రమణయ్య నాకు దొరకలేదు; ఏదో పొరపాటున, ఏదో ఏమరుపాటున ఒక్కసారి ధైర్యం చేసి సంచలనాత్మకమైన ఒక వార్త పంపిందాడు; అప్పుడైనా కొంతకపడినా నేమోనని పశ్చాత్తాప పడివుంటాడుకాని, ఆ వార్తకు పోలిస్ అధిని వన్మానించిందికూడా. వార్తను లోతుగా కూపీ తీయడం చేతకాకకాదు; ఇష్టంలేకనే;

రమణయ్యకు అరవయ్యేళ్ళు నిండాయంటే చెప్తే నమ్మవలసిందే; పరుగులు తీసే ఆ మనిషిని చూస్తేమాత్రం అతని కంత వయసున్నదంటే నమ్మరు; ఏదో పరదాకు షష్టిపూర్తి జరుపుకుంటున్నాననుకుంటారు. శరీర పటుత్వం పడలేదు; వెంట్రుక నరవలేదు; ఉత్సాహం తరగలేదు; ఇంకా యవ్వనపు హద్దులు దాటలేదా అనిపిస్తుంది. అటువంటప్పుడు షష్టిపూర్తి జరుపుకొని తనకుతానుగా ముసలివాళ్ల జాబితాలో చేరడం ఎందుకో మరి;

రమణయ్య ఆరోగ్యరహస్యం అతని అజాతశత్రుత్వంలో, సత్యప్రియత్వంలో, వివాదరాహిత్యంలోనేవుంది; ఐక్యమత్యం. అందునా స్థానిక జర్నలిజం మనిషిని భ్రష్టుగతిస్తుంది; నల్ల గుల్లచేస్తుంది; స్నేహితులకంటే శత్రువుల సంఖ్యను పెంచుతుంది. దానికి మినహాయింపు మనరమణయ్య.

రమణయ్యా! నీవు ఆయురారోగ్యంతో పాత్రికేయుడుగానే ఇదే వుత్సాహంతో నూరేళ్ళ జయంతినికూడా జరుపుకోవాలి; అది నా ఆకాంక్ష;



## విడవలూరు గ్రామపంచాయితీ
## టెండరు ప్రకటన

ఆర్.ఒ.సి. నెం. 15/85 తేది 5-5-85

నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా విడవలూరు గ్రామపంచాయితీకి ఈ క్రింద కనబరచిన వస్తువులు దఫాలవారీగా 1985-86 సంవత్సరమునకు సప్లయి చేయుటకు మరియు ఈ క్రింద కనబరచిన పనులు చేయుటకు తేది 20-5-85 సోమవారం ఉదయం 11 గంటలకు టెండర్లు తీసుకొనబడును. కాన టెండర్లు వేయదలచినవారు నిర్ణయించిన ధరావత్తు చెల్లించి టెండర్లు దాఖలు చేయవలయును అదేరోజు ఉదయం 11-30 గంటలకు హాజరైన టెండరుదార్ల సమక్షమున టెండర్లు తెరువబడును. మిగతా వివరములు ఆఫీసు పనిచేయు వేళలందు తెలిసికొనవచ్చును.

| వ. నెం. | వస్తువుల వివరము | | ధరావత్తు |
|---|---|---|---|
| 1) | వీధి విద్యుత్‌దీపములకు అవసరమైన బల్బులు ట్యూబులు చోకులు స్టార్లరు వగైరాలు సప్లయి చేయుటకు (అనుమతి పొందిన కంట్లుమాత్రమే) | | 100/- |
| 2) | స్టేషనరీ సామానులు సప్లయి చేయుట | | 25/- |
| 3) | బ్లీచింగుపౌడరు, ఫినాయిలు పొడినున్నం కావలసిన పారలు గెడలు, గంపలు, శంకాయవుల్లలు వగైరా సప్లయిచేయుట | | 25/- |
| 4) | బోరు బావులకు అవసరమైన స్పేర్‌పార్టులు సప్లయిచేయుట | | 50/- |
| 5) | ప్రజారోగ్య సిబ్బందికి కావలసిన బెడ్డీ కాకి యూనిఫారములు చెప్పులు సప్లయి చేయుట | | 25/- |
| | — పనుల వివరము — | | |
| 1) | ఎద్దలరేవు డొంకలో బోరువెల్ నిర్మించుట ఎస్టిమేటు | 6400/- | 320/- |
| 2) | ఆయిల్‌మిల్లు కాంప్లెక్సుకు కాలేజి రోడ్డు నుండి రోడ్డు నిర్మాణము చేయుట ఎస్టిమేటు | 5000/- | 250/- |
| 3) | ఎద్దలరేవు కలుజావద్ద డొంకకు పడిన గండిని పూడ్చుట ఎస్టిమేటు | 200/- | 10/- |

టి. రమణయ్య
కార్యనిర్వహణాధికారి

# అభ్యుదయ పథంలో నెల్లూరు యువతరం!

మొన్నొక మిత్రుడు తన కుమార్తె పెండ్లి పత్రికను దీవనవంతో ఇచ్చాడు. కారణం ఏమీలేదు ఆ పెళ్ళి వర్ణాంతర మైందేకాదు, భాషాంతరము, రాష్ట్రాంతర మైంది కూడా! అతని విచిత్రపోవడానికి అదే కారణం. కాని ఆ పత్రిక చూచిన తర్వాత మాకు పరమానందం కలిగింది. ఇద్దరూ పట్టభద్రులు; ఒకేచోట పని చేస్తున్నారు; ఒకరినొకరు అర్థం చేసుకున్నారు; భార్యాభర్తలుగా జీవితాన్ని గడపదలచుకున్నారు. దానికి తల్లి దండ్రులు అంగీకరించారు. పరోక్షంగానే ఎందుకు ఆక్షేపించాలి, ఎందుకు పశ్చాత్తాపపడాలి, ఎందుకు దిగులుపడాలి?

మనజిల్లా యువకులు అంతర్ రాష్ట్ర, అంతర్ భాషా, అంతర్ వర్ణ వివాహాలకు ఏనాడో ముందడుగు వేశారు. ఇప్పుడు మతాంతర వివాహాలుకూడా మామూలైపోయాయా అనిపిస్తున్నది. మొన్న మొన్ననే ఒక వున్నత రెడ్డి కుటుంబానికి చెందిన విద్యార్థిని ఒక ముస్లిం యువకుణ్ణి పెళ్ళిచేసుకున్నదట. దనము, చదువు. అంతస్తు చూసి చేసుకున్న పెళ్ళిగాకూడా కనపడదంటారు. ప్రేమ గ్రుడ్డిదని షేక్స్పియర్ అనలేదు, లేకుండా గ్రుడ్డిగా చెప్పాడని అనుకో గలమా? కాలం మాత్రమే గమనించి, వమూనావడి, చిరంజీవ చిరంజీవ అని దీవించడం వివేకవంతమవుతుంది. చేయగలిగింది లేనపుడు తల్లిదండ్రులకు మిగిలింది అదేగదా!

• • •

### అల్లూరు-నెల్లూరు

అల్లూరు జూనియర్ కాలేజి కరస్పాండెంటు శ్రీ అల్లంపాటి రామిరెడ్డి కుమారుడు జయవర్ధనరెడ్డి; నెల్లూరు వావలీ నగర్ వాసి శ్రీ చెన్నారెడ్డి రాఘవరెడ్డి కుమార్తె ఇందిర వివాహం ఏప్రెల్ 26 తేది నెల్లూరు టి టి డి కళ్యాణమండపంలో జరిగింది.

### కావలి వివాహం

శ్రీ వి. జి కృష్ణమూర్తిగారిని అవలు పరిచయంచేయాల్నా. చేసేట్లుంటే ఎట్లా పరిచయంచేయాలి అనేది పెద్ద ధర్మ సందేహం. ప్రముఖ మాజీకార్యదర్శి వి. ఆర్. కాన్ఫ్ ఇష్టపడుదంటామా, స్వర్గీయ ఆర్. యల్. రెడ్డి అనుంగు మిత్రుడంటామా. అధికారులంతే గర్వించదగిన మన మేకప్ మన్మయోగి డాక్టర్ వి. చంద్రశేఖరం తమ్ముడంటామా!

## పెండ్లిండ్లు

ఇవేవీకాకుండా కృష్ణమూర్తిగారిని జగమెరిగిన బ్రాహ్మణుడనే అనిపిస్తుంది! అందరినీ చిరునవ్వుతో ప్రేమగా పలుకరించే శ్రీ వి. జి. కృష్ణమూర్తి కుమారుడు మహేష్, అనంతపురం శ్రీ సి. యల్. ప్రసాదరావు కుమార్తె గీతా కుమారి పరిణయం ఏప్రెల్ 27 తేది కావలిలో జరిగింది.

### గడ్డం కృష్ణారెడ్డి కుమారుడు

నెల్లూరు- స్నేహశీలి శ్రీ గడ్డం వెంకట సుబ్బారెడ్డి అనే కృష్ణారెడ్డి కుమారుడు మల్లికార్జునరెడ్డి; ఇన్ని. శ్రీ పన్నప రెడ్డి వెంకటరెడ్డి కుమార్తె భారతి కళ్యాణం ఏప్రెల్ 14 తేది నెల్లూరు 'అనితా' థియేటర్లో జరిగింది.

### రేవతి - ఆదిశేషయ్య

నంద్యాల విద్యుత్ శాఖ అసిస్టెంటు ఇంజనీరు శ్రీ వి. కృష్ణమూర్తి బి. ఇ. మరదలు; నెల్లూరు- స్వర్గీయ శ్రీ సుబ్రహ్మణ్యం కుమార్తె రేవతి; నెల్లూరు- స్వర్గీయ ఎం. గోపాలకృష్ణయ్య కుమారుడు, స్టేట్ బ్యాంకీయుడు ఆదిశేషయ్యకు ఏప్రెల్ 18 తేది ఆంధ్రసభ భవనంలో పెండ్లి జరిగింది.

### మద్రాసు మ్యారేజి

మద్రాసు- ఇంటిగ్రెల్ కోచ్ ఫ్యాక్టరీలో పనిచేస్తున్న కోవూరీయుడు శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి తనయ పద్మజ; శ్రీ సి. ఐ. థామస్ కుమారుడు మాథ్యు వివాహం ఏప్రెల్ 27 తేది మద్రాసులో జరిగింది.

వధువు తెలుగు ఆడపడుచు వరుడు

## రాష్ట్రాంతర భాషాంతర మతాంతర వివాహాలు

కేరళీయుడు. ఇద్దరు హోంగార్డ్ నిర్వహణకు సంబంధించిన విభాగంలో పట్టభద్రులు; ఇద్దరు మద్రాసు- కార్ కోచ్ మాండల్‌లో పనిచేస్తున్నారు.

వీరి ఆదర్శవివాహం నూరేళ్ళ పంటలా శాంతితో వర్ధిల్లాలి.

### మే వివాహాలు

#### విశ్వోదయ

కావలి విశ్వోదయుడు డాక్టర్ జె వి. సుబ్బారావుడు కుమార్తె అనూరాధ; మద్రాసు- జాయిన్ ఇన్‌స్పెక్టరుగా పనిచేసి కీర్తిశేషుడైన దోనెంపూడి సత్యనారాయణరావు కుమారుడు సుధాకర్ వివాహం 1 తేది జవహర్ భారతి విజ్ఞాన మందిర్‌లో జరిగింది.

—కొనసా 8 వ పేజీలో

## జనవాణి

(3వ పేజీ కొరవ)

సాగుచేసే శ్రమను వదలికోవల్సి రైతు సుఖపడలేదేమో వనిపిస్తూంది.

గనామాంబాపురం -కె.ఎల్.కె.శర్మ

### పరీక్ష కేంద్రంపాట్లు

సైదాపురం హైస్కూలులో గత పదేళ్ళనుంచి 10 వ తరగతి పరీక్షకేంద్రం వుంది. ఇటీవల ఈ స్కూలుపిల్లలను చెన్నూరుకుపంపి ప్రైవేటు విద్యార్థులకు సైదాపురంలో పరీక్ష పెట్టారు. సైదాపురం నుంచి చెన్నూరుకుపోవడానికి ఉదయం 7-30 గంటలకుగాని గూడూరు బస్సు రాదు. 8-30 కి పరీక్షకు అందుకోడానికి విద్యార్థులు పడినపాట్లు చెప్పనలవికాదు.

దీనికితోడు, సైదాపురంలో 250 మంది ప్రైవేటు విద్యార్థులకు వసతి. భోజనాది సౌకర్యాలు దొరకడం దుర్లభం. వారు యాతన పడవలసివచ్చింది.

అందువల్ల అధికారులు కనీసం పై ఏడాదికైనా పరీక్ష కేంద్రాన్ని యధాతథంగా సైదాపురంలోనే కొనసాగించగల్గితే అందరికీమేలు.

సైదాపురం -ఎ. వేణుగోపాల్

### రోడ్డులేదు!

1958 తుపాను మా గ్రామంలోని నిమ్మచెట్లన్నీ వ్రేళ్ళతోటి పెకలించుకొని పడిపోయాయి జిల్లాలోని తక్కినచోట్ల తుఫాను బాధితులకు సహాయం చేశారు కాని, మా పాపమేమో ఇప్పటివరకు మాముఖం చూడలేదు. 9-5-85 తేది రెవిన్యూ మంత్రి శ్రీనివాసులరెడ్డి చేతి మీదుగా సహాయం రైతుల చేతిలో పెట్ట బోతున్నామని అధికార్లు చెప్తున్నారు; అది ఎంతవరకు నెరవేరుతుందో చూడాలి.

ఇంతకంటే మాకు బాధాకరంగావున్న సమస్య రోడ్డు దుస్థితి, రోడ్డు సరిగా లేనందువల్ల నిమ్మకాయలు, మిరపకాయలు. ఇతర వ్యవసాయోత్పత్తులకు చాల ఇబ్బందిగావుంది. కాబట్టి మా గ్రామానికి సరైన రోడ్డు సౌకర్యం కల్గించవలసిందిగా కోరుతున్నాము.

—ఎం. నాసరాజు, వాగణంరాజుపాళెం.

### అభినందనలు

ముళ్ళదండనుకూడా పూలహారంవలె భావించి సిసిసి అధ్యక్షపదవిని అలంకరించిన శ్రీ జలగం వెంగళరావుకు మా హృదయపూర్వక అభినందనలు.

ఇకముందికూడా రాష్ట్ర, జిల్లా కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తల వర్గ విభేదాలుమరచి, ఏకతాటిపై నడిచి సిసిసి అధ్యక్షునికి పూర్తి సహాయ సహకారాలందజేయగలిగితే, కాంగ్రెస్ తన పూర్వప్రతిష్ఠను, బలాన్ని తిరిగి పొందగలదనడంలో ఎటువంటి సందేహమూ లేదు.

అల్లూరు —"శ్రీరామ్"



Edited, Printed & Published by N. Sree Ramamurthy at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)